# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 11 | రాజమహేంద్రవరము 1-12-1987 | సంచిక 2, 3

### → ఈ సంచికలో ←



రాబోవు సంచికలో .- బాపిరాజు గారి సంభాషణచాతుర్యం, అశ్వధాటి, కీరజన మనోవిరాజితం, ఆంధ్ర సాహిత్యంలో ప్రార్థన స్వప్నాలు, వేసుంట చితి-చింత, మొదలగునవి ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా : సంవత్సరమునకు రు. 12-00.
అర్ధసంవత్సరమునకు రు. 6-50.

విడిప్రతి 60 పై.

# ★ స మా లో చ న ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.


## భోగినీ దండక కర్తృత్వ నిర్ణయము


- శ్రీ జి. ఎ. ఎస్. ఎస్. సోమయాజులు శర్మ, ఎం. ఏ.


పోతన మహాకవి (1) వీరభద్రవిజయము, (2) నారాయణశతకము (3) భోగినీదండకము, (4) భాగవతము నను నాల్గు కృతులను రచించెను దండక రచనయందుఁ బోతనకు మక్కువ యెక్కువ. వీరభద్రవిజయములో వీరభద్ర దండకమును (వీ. వి. 4-180) భాగవతమునందలి తృతీయదశమ స్కంధములలో (3 స్కం - 208; 10 స్కం-1 - 1233) రెండు కృష్ణదండకములను రచించినాఁడు. భాగవత దండకములకు భోగినీ దండకమునకుఁ బోలిక లెక్కువగాఁ గలవు. శ్రీకృష్ణోత్సవ క్రీడలో నున్న సింగభూపాలు నొక మేడలో నుండి వారకన్య చూచి మోహించి తన్ను సింగభూపాలునితోఁ గలుపుమని తల్లితోఁ జెప్పుట, వేశ్యమాత తన కూఁతునకు బుద్ధులు చెప్పుట, చివరకు మన్మథసంతాపమునొందిన వారకన్యను సింగభూపాలునితోఁ గలుపుట, సింగభూపాలుఁ డా భోగిని నాదరించుట యిందలి యితివృత్తము.

### దండక నాయకుడు

'వసంతావనీనాథ సంసేవితాంచత్కృపాంగా .. .. సింగభూపాల .. కుమారాన్నపోతావనీ నాథ సూనో .. సర్వజ్ఞ సింగక్షమానాథు ..... పోచమాంబాలసద్గర్భసంజాతుపై .. రావు సింగక్షమానాథ పౌత్రున్ సమీచీన రేచర్ల గోత్రాంబుజాతాత్మ మిత్రున్ . సర్వజ్ఞ సింగోర్వరాధ్యక్షుఁ' అను దండక పంక్తులను బట్టి యీ దండక నాయకుఁడైన సింగభూపాలుఁడు రేచర్ల వంశజుఁడనియు, రావుసింగక్షమానాథుని పౌత్రుఁడనియుఁ బోచమాంబా కుమారాన్న పోతావనీనాథుల పుత్రుఁడనియు, వసంతావనీ నాథుని సోదరుఁడనియు స్పష్టముగాఁ దెలియుచున్నది.

రసార్ణవ సుధాకరము, రత్నపాంచాలిక, సంగీత రత్నాకరవ్యాఖ్య మొదలగు గ్రంథములు రచించి మల్లినాథ, విశ్వేశ్వర కవి చంద్రాదుల నాదరించినవాఁడు మొదటి సర్వజ్ఞ సింగభూపాలుఁడు. అన్నమాంబానపోతనాయకు లితని జననీ జనకులు. దేవగిరి యగ్రజుఁడు.

అన్నమాంబేతి విఖ్యాతా,<br>
తస్యాసీ ద్ధరణీ పతేః ।<br>
దేవీ శివా శివస్యేవ,<br>
రాజమౌళే ర్మహోజ్జ్వలా ॥ (1-24)<br>
తయోరభూతాం పుత్రౌ<br>
ద్వావాద్యో దేవగిరీశ్వరః ।<br>
ద్వితీయ స్త్వద్వితీయోఽభూ,<br>
ద్యశస్వీ సింగభూపతిః ॥ (1-26)<br>
తస్మిన్ శాసతి సింగభూమి రమణే<br>
క్ష్మామన్న పోతాత్మజే (1-48)

అని యీవిషయములు రసార్ణవ సుధాకరమునందు స్పష్టముగాఁ గలవు.

ఇతని మనుమఁడగు రెండవ సర్వజ్ఞ సింగభూపాలుఁడే భోగినీ దండకమున వర్ణింపఁబడిన వాఁడు. పోచమాంబానపోతనాయకు లితని జననీ జనకులు. వసంతావనీ నాథుఁడు తమ్ముఁడు. 'వెలుగోటి వారి వంశావళి' యందీ విషయము స్పష్టముగాఁ గలదు.

'ఆయన పోతమనేనికి సర్వజ్ఞ సింగమనేఁడును, వసంతరాయఁడును బుట్టిరి. అందగ్రజుండు సకల విద్యాభ్యాస సాహసకర్మంబు నూటి మీఁగఁ దోడు మాపినాఁడు .. శ్రీనాథుఁడు సర్వజ్ఞుని సమ్ముఖమునకుఁ బోవుచు శారదాంబను ప్రార్థన చేసిన పద్యము

'దీనారటంకాలఁ దీర్థ మాడించితి<br>
దక్షిణాధీశు ముత్యాలశాల .. ..'

దీనిని బట్టి ద్వితీయ సర్వజ్ఞ సింగభూపాల-పోతన-శ్రీనాథులు సమకాలికు లని స్పష్టమగుచున్నది. ఈ రెండవ సర్వజ్ఞ సింగమనాయని కాలము 1400 - 1470. పోతన భోగినీదండకము నందు వర్ణింపఁబడిన రెండవ సర్వజ్ఞ సింగభూపాలునే శ్రీనాథుఁడు దర్శించినట్లు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి 'శృంగార శ్రీనాథ' ములో నిరూపించినారు.

## పోతన కాల నిర్ణయము

ఇది యిట్లుండఁగా శ్రీ చాగంటి శేషయ్యగారు రుశిరిచ్చుచూ వచ్చినట్లు కాలములను దారుమాలు చేసి, పోతిన శ్రీనాథ సింగభూపాలు రోశ కాలములోని వారు కారనియు, భోగినీ దండకము పోతన విరచితము కాదనియు,నవ సిద్ధాంతము చేయుట మహాసాహసము వారు నిర్ణయించిన కాలములు సరియైనవి కావు. పోతన కాలమును విమర్శకులు తలకొక విధముగా నిర్ణయించినారు

| | |
|---|---|
| భాగవతపీఠికాకారులు | 1372-1450 |
| కందుకూరివారు | 1400-1460 |
| వంగూరి సుబ్బారావుగారు | 1480-1520 |
| చాగంటి శేషయ్యగారు | 1450-1510 |
| శేషాద్రి రమణ కవులు | 1375-1440 |

వీనిలో భాగవతపీఠికాకారులు, శేషాద్రి రమణ కవులు నిర్ణయించిన కాలమే సుమంజసమైనది. పోతన కాలము 1370-1450 అని నిర్ణయించుట కన్నియో యాధారములు గలవు.

### పెదకోమటి పురశాసనము

'తస్యానుజో వేమనృపస్య మాచ
క్షితీశ్వరో లబ్ధ మహీవిభాగః।
శ్రీకొండపల్లీం నిజ రాజధానీం
కృత్వా సుఖీ దీవ్యతి ధర్మ ధుర్యః॥

మాచారెడ్డిరాజ్యమునకుఁ గొండపల్లిరాజధాని. మాచారెడ్డి కొండపల్లి రాజ్యాధిపతి యైన కాలమున సకల భాషాకవితా మూర్ధాభిషిక్తుఁడు, విద్వన్నిరూఢ రాజాస్థాన సుధాంభోధి పూర్ణచంద్రుఁడు, గద్యశ్రీ బాణకవి, పద్యశ్రీ కాళిదాసకవి యైన పోతనాఖ్య విద్వత్కవికి శ్రీబల్యపురము పెదకోమటి పురమును పేర దానమిచ్చెను." (కొర్లపాటి వారి శ్రీనాథుఁడు పుట. 32)

బాణుని గద్యములవంటి గద్యములు భాగవతములో పెక్కువగాఁ గలవు. కాళిదాసుని ధార, ప్రసాదగుణము, భావగాంభీర్యము భాగవతములో సర్వత్ర కన్పట్టును. కాళిదాసుని యిందుమతీ స్వయంవరమును దృష్టి యందుంచుకొని పోతన భాగవతములో దశమస్కంధోత్తరభాగమునఁ జిత్రరేఖ యుషాకన్యకుఁ జిత్రపటములు చూపు సందర్భములో రాజకుమార వర్ణన పద్యములను (10-2-847 -859) రచించినాఁడు మాచారెడ్డి రాజ్యకాలమునఁ బోతనాఖ్య విద్వత్కవి భాగవతకర్త యగు బమ్మెరపోతన తప్ప సంస్కృతాంధ్ర కర్ణాట రాజ్యములలో మఱియొక్కఁడు లేఁడు. కావునఁ దైశాసనములోఁ జెప్పఁబడిన విద్వత్కవి బమ్మెరపోతనయే యని యంగీకరింపక తప్పదు. పెదకోమటి వేమారెడ్డి తమ్ముఁడు మాచారెడ్డి వేమారెడ్డి రాజ్యకాలము 1402 - 1420.

శ్రీకృష్ణదేవరాయ లాముక్తమాల్యదలో 'ఎవ్వని చూడ్కిఁ జేసి జని యించు జగంబు వసించు నిజ్జగం బెవ్వని యందు' (ఆము 6-48) అను పద్యములోఁ బోతనగారి "ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై" (భాగ-8-73) అను పద్యము ననుకరించినాఁడు

రాయవాచకము నందు "విద్యానగరమందు వీరనృసింహరాయలవారు బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళులున్ను, ఆధ్యాత్మ సంకీర్తనలున్ను, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షం, భారతసావిత్రి, దధివామన స్తోత్రము, గంగావతరణమున్ను నదీస్తోత్రమున్ను, భారతం, భాగవతం, రామాయణం, ముచుకుందస్తుతి, అక్రూరస్తుతి, భీష్మస్తుతి, సంజయునీతి, విదురనీతి, చాణక్య (చాణూర?) నీతి పద్యనీతి, మొదలైనవిన్ని, నీతివైరాగ్య శతకం పురాణశ్రవణమున్ను రాజనీతు లన్నియు విని" అని కలదు. దీనినిబట్టి వీరనరసింహరాయలు వినెడి గ్రంథములలో నాంధ్ర భాగవతము కూడ నుండె నని తెలంపవచ్చును. దీని కుపోద్బలకముగా రాయవాచకమునందే కృష్ణరాయలు వినెడి నీతి పద్యముగా 'ములఁకలం మా ప్రచారములు మా ముఖమల్ విమళహ్ని యోరముల్' (భాగ 10-1-69) అను పోతన భాగవత పద్యమును స్థానాపతి యుదాహరించినాఁడు. కాఁబట్టి 1500 నాటికే భాగవతము మిక్కిలి ప్రచారములో నున్న గ్రంథ మని తెలియుచున్నది.

పద్మాసన సుకవి కంజలి యొనర్చి
యుభయకవి మిత్రునకు హస్త
యుగళి మోడ్చి
శంభుదాసుని సోమ భాస్కరుఁ దలంచి
యాంధ్రవాగ్భావకకర్త నభినుతించి
(రామా-1-10)

అని రామాభ్యుదయములో నయ్యలరాజు రామభద్రుఁడు పోతనను స్తుతించినాఁడు రామభద్రుఁడు రాయల యాస్థాన కవియే యని కాకర్ల నరసింహముగారు రామాభ్యుదయ పీఠికలో నిరూపించినారు.

'వాచనామాత్య సోము శ్రీనాథుఁ జిమ్మపూఁడి యమరేశు బమ్మెరపోతరాజు శంభుదాసు హుళక్కి భాస్కరుఁడు నాది యైన సుకవుల కెల్ల నెయ్యమున మ్రొక్కి'
(చి.భా 1-8)

అని చిత్రభారతములోఁ జరికొండ ధర్మన్న పోతనను స్తుతించినాఁడు. చరికొండ ధర్మన్న కాలము క్రీ శ. 1503 - 1512 నడుమ ననియుఁ, జిత్రభారతము క్రీ శ. 1503-1512 నడుమ రచితమయ్యె ననియుఁ జాగంటి వారే నిరూపించినారు. భైరవకవి శ్రీరంగ మహాత్మ్యములో—
లలిత కవిత్వరేఖ పథ
అత్యము నొందఁ వశేవ కల్పితం
బుఁ దొరఁగించి నిత్యసుఖ
మూలములై హరి భక్తిదంబులై

వెలయు పురాణ సత్కథల
వేడ్క రచించి జగత్ప్రసిద్ధులై
పొలుచు మహాత్ములన్ సుకవి
పుంగవులన్ ప్రణుతించి వెండియున్
రహి నిక్కిన కవితలఁ దహ
తహఁ జొక్కిన నృపులచేతఁ దగ
సత్కృతులై
మహిఁ దక్కిన కవులందును
వహి నెక్కిన కవుల నేఁటి వారలఁ
బ్రీతిన్. (శృంగ-1-8,9)

అను పద్యములలోఁ బోతనను శ్రీనాథుని స్తుతించుటయే కాక; పోతన భాగవత మును శ్రీనాథుని కృతులను నెక్కువగా ననుకరించినాఁడు. గౌరనకవి కాలము 1376 - 1460 అని శ్రీరంగాచార్యగారు నిశ్చయించినారు. ఇంక భాగవతము నందలి శిథిల స్కంధములను బూరించిన యేర్చూరి సింగయ, వెలిగందల నారయ, హరిభట్టు రాచమల్లు కవులు (వందియ మల్లయ - ఘంట సింగయ) మొదలగు కవు లందఱును 15 వ శతాబ్ది యుత్త రార్ధమునం దున్నవారు కాఁబట్టి భాగ వత రచనము 15 వ శతాబ్ది పూర్వార్ధము నందే యనఁగా 1430 నాఁటికే పూర్తి యైన దని యంగీకరింపక తప్పదు పోతన క్రీ శ.1370 ప్రాంతమున జన్మించి 1385-1390 మధ్యకాలములో వీరభద్ర విజయ మును, 1400 ప్రాంతములో నారాయణ శతకమును, 1445 ప్రాంతములో భోగినీ దండకమును, 1425 - 1450 మధ్యకాల ములో భాగవత పురాణమును రచించె నని స్థూలముగా నిర్ణయింపవచ్చును.

రెండవ సర్వజ్ఞ సింగభూపాలుఁడు 1425 సంవత్సరమున సింహాసనము నధి ష్ఠించినట్లు నేలటూరి వెంకట రమణయ్య గారు నిరూపించినారు.

శ్రీనాథుని జననము 1360 - 1370 మధ్యకాల మనియు మరణము 1450-60 మధ్యకాల మనియు విమర్శకుల యాశ యము. కావునఁ బోతన- శ్రీనాథ-సింగ భూపాలురు సమకాలికు లని నిర్వివాద మగు సిద్ధాంతము. ఇంక భోగినీదండకము పోతన విరచిత మనుటకుఁ గల బహిరంగ ప్రమాణములను బరిశీలింతము.

బహిరంగ ప్రమాణములు -

(1) వెల్లంకి తాతంభట్టు తన కవి చింతామణిలో 'భోగినీదండకము - ఏల రేలుఁడ్ బగళ్ళున్ విచారింప' నను పంక్తి నుదాహరించినాఁడు కావున 15వ శతాబ్ది యుత్తరార్ధమునకు ముందే భోగినీదండ కము ప్రసిద్ధమైనట్లు తెలియుచున్నది.

(2) వెంకటగిరివారి వంశావళిలోని కృతిలోన సర్వజ్ఞ సింగభూపాలుండు
బలవైరి సన్నుత పౌరుషుండు
లలిఁ గావ్యనాటకాలంకార చతురుండు
సకల శాస్త్రార్థ విశారదుండు
వలనొప్ప సింగభూపాలీయ నామక
గ్రంథంబు రచియించెఁ గౌతుకమున
మాను భాగవతమును దెనుఁగుచేసిన యట్టి
బమ్మెర పోతన బాగు మీఱఁ
దనకుఁ జెప్పిన భోగినీదండకమును
వెలయ శ్రీనాథనామక విప్రవరుడు
కోరి చెప్పిన పద్యముల్, కొని ముదాప్తిఁ
బెంపుతో వారి మన్నించి పేరు వడసె.

అను పద్యము బమ్మెరపోతన సింగ భూపాలునిపై భోగినీదండకమును జెప్పి నట్లు స్పష్టముగా తేటపడుచున్నది.

(3) ఈ విషయమునే శ్రీ టి. రామా రావుగారు కూడ నిట్లు చెప్పినారు.

*It is highly interesting to learn that the eldest of them (Sarvajna Singama Noidu) was greatly learned in Sanskrit Literature, Poetry, drama, Logic, grammar and rhetoric and that he himself composed a work on the last mentioned subject called Singa Bhupaliyam. His court it said to have been adorned by several poets among whom were Bammera Potarazu who translated Bhagavatam in Telugu and Srinathudu, the Telugu translator of Naishadham Sarvajna Singama Naidu formed subject of composition by the former called 'Boogini Dankam' and some stray verses by the Latter. (Biographical Sketches of the Rajahs of Venkatagiri pages 26 - 27: Ed 1875.)*

(4) శతకకవుల చరిత్రలో శ్రీవంగూరి సుబ్బారావుగారు—

"పరిషత్తులో నెం. 218"న నొక లేఖ కుఁడు భోగినిదండక నారాయణ శతక ములఁ గలిపి వ్రాసికొని యిట్లు వ్రాసి నాఁడు. 'ముష్టూరి బాలమరాజా కొమా రుఁడు పెదవెంగయ వ్రాసిన నారాయణ శతకం, భోగినీదండకము.' ఒకవేళ నీ లేఖకుఁ డివి రెండును బోతన్న వని విని, వాడుక వలన నట్లు వ్రాసెనేమో? దండ కము చివర పోతన్న వ్రాసినట్లు చెప్పు టకు వీలైన పద్య మున్నది' అని వ్రాసి నారు. ఒక్క పెదవెంగయ్యయే కాద. ప్రాచీన పండితు లందఱునట్లే తలంచిరి. వెల్లంకి తాతంభట్టు కూడ 'సెలయేఱ్ నిర్మలమైన' (నా. శ. 8; క. చిం.1-80) అను నారాయణ శతకపద్యము నుదాహ రించి దానికి వెనువెంటనే భోగినీదండక పంక్తి (క. చిం. 1-84) నుదాహరించి నాఁడు.

(5) 'పండితకీర్తనీయుఁ డగు బమ్మెర పోతన' అను దండకాంత పద్యములో దండకకర్త పోతన యని స్పష్టముగాఁ గలదు. దండకాంతపద్యమును శంకించుట మహాసాహసము.

దేవకీ సుతుకోర్కి తీఁగెలు వీడంగ
వెలఁదికి మైఁదీఁగె వీడఁ దొడఁగె.

(భాగ-10-1-1090)

(11) హాయానేకప్రగాము హేమాది
నానా మహాదాన 'చంగున్' (భో.దం)
ఉజ్జ్వల నీలాంగుఁ గనన్నిమంగుఁ
గొహానా 'చంగున్' రణా భంగునిన్,

(భాగ.10-2-168)

(12) ఉల్ల సత్ఫుల్ల మందార రాజన్మ
రందంబు నందంబునన్ గ్రోలు మత్తాళి
దుత్తారముల్ గోరునే? . (భో.దం)
మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే? మదనములకు

(భాగ-7-150)

నీరదాగమ మేఘ నిర్ముక్తప్రయః పాన
చాతకం బేఁగునే? చాటి ఏడకుఁ

(భాగ 10 2-257)

(13) కోదండియై దండియై తూణియై
బాణియై (భో.దం.)
ప్రళయాగ్ని చ్ఛట భంగిఁ గుంభి వికళిం
పంబాఱు సింహాకృతిన్
బెలుచన్ రాముఁ డిలేశు వెంట నడచెన్
బృథ్వీతలం బెల్ల నా
కలమై నింగిఁ గుఠారియై కవచియై
కోపియై కాండియై
ఛలియై సాహసియై మృగాజిన మహో
జ్ఞ శ్రోణియై తూణియై.

(భాగ-9 444)

పండిత కీర్తనీయుఁడగు
బమ్మెరపోతన యా సుధాంశుమా
ర్తాండ కులాచలాంబు నిధి
తారక మై వెలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బటు
దాన విహర్తకు రావుసింగభూ
మండల భర్తకున్ వినుత
మానవనాథ మదాప హర్తకున్.

ఇది దండకాంత పద్యము. 'ఆచంద్ర తారార్కమై యొప్పుచుండున్' అను దండకాంతిమవాక్యమే యీ పద్యము నందలి రెండవ పాదముగా విస్తరించినది. సరిగా నిట్టి పద్యమే భాగవతములోఁ గూడఁ గలదు.

స్వస్తి జగత్త్రయీ భువన
శాసన కర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింప భర్తకు సు
దారపద వ్యవహర్తకున్ మునిం
ద్ర స్తుత మంగళాధ్వర వి
ధాన విహర్తకు నిర్జరీగళ
న్యస్తసువర్ణ సూత్ర హరి
హర్తకు దానవలోక భర్తకున్.

(భాగ-8-545)

శ్రీ గురజాడ శ్రీరామమూర్తి గారును, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు నీ పద్యములోఁ 'బండిత కీర్తనీయుఁ' డని యాత్మశ్లాఘయుండుటచే, 'బమ్మెరపోతన' యని ప్రథమ పురుషములో నుండుటచే నిది పోతన విరచితముగా దని సందేహించుచున్నారు. శ్రీనాథాదులు చేసికొన్న యాత్మశ్లాఘలో శతాంశముకూడఁ 'బండిత కీర్తనీయుఁ' డన్న వాక్యములో లేదు. ప్రథమ పురుషము వాడుటయుఁ బ్రాచీన సంప్రదాయమే. పోతనయే భాగవతమునందుఁగూడ 'బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్' (భాగ-1-18) అని ప్రథమ పురుషము వాడినాఁడు. 'వాల్మీకిర్మునిపుంగవః', 'మను మేకాగ్రమాసీనమ్', 'మునిముఖ్యః పరాశరః', 'నన్నయభట్టు తెనుంగున్', 'రవికులశేఖరుండు కవిరాజశిఖామణి', 'సత్కవి సార్వభౌముం డగు శ్రీనాథకవివరేణ్యుని కృపావిశేషంబునం గాంచి' అని వాల్మీకి, మనువు, పరాశరుఁడు, నన్నయభట్టు, నన్నెచోడుఁడు, శ్రీనాథుఁడు మొదలగువారు ప్రథమ పురుషమును వాడినారు. కావున దండకాంత పద్యముకూడఁ బోతనదే యనియు, భోగినీదండకము పోతన కృతమే యనియు నిశ్చయమగుచున్నది.

శ్రీ కందుకూరివారు, శేషాద్రిరమణకవులు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, దివాకర్ల వేంకటావధానిగారు, ఆరుద్రగారు మొదలగు సాహిత్య చరిత్రకారు లందఱును భోగినీదండకము పోతన కృతి యనియే భావించుచున్నారు. కాలములను దారుమాఱు చేసి, భోగినీదండకము పోతన విరచితముగా దని నిరూపించుటకు మిక్కిలి శ్రమపడిన వంగూరివారు, చాగంటివారును గూడఁ జివరకు భోగినీదండకము పోతన విరచితమనియే యంగీకరించిరి. వీరి వాక్యములను జూడుఁడు--

"కావున నిది పోతన్నదే యనుటకు దగినంత నిదర్శనములే దనియు, నొకవేళఁ బోతన్న వ్రాసినను దండకరచనమునందు దోషముగాని, యాతని నియమభంగము గాని కలుగలే దనియు మనవి చేయుచున్నాను."

(శతకకవులచరిత్ర-117 పుట)

'ఎట్లయిన భోగినీదండకమును పోతనామాత్యుఁడు రచింపలే దని నిర్ధారణము చేయుటకై శ్రమపడుట నా యుద్దేశము కాదు. ఆ దండకమును రచించె ననినంత మాత్రమున నాతని స్వభావమునకుఁ గళంకము రాదు. యౌవనమునఁ బ్రభుప్రోత్సాహముచే నట్టిదండకము నాతఁడు చేసె ననిన నందు దోషము లేదు. ఈ దండకమునకు నాయకుఁడు రెండవ సర్వజ్ఞుఁ డనుట నిశ్చయము. ఆకాలము నందలి ప్రభువులు, మంత్రులు, వేశ్యాలంపటత్వము దోషముగాఁ దలంపలేదు, సరిగదా గౌరవముగా భావించుచుండిరని మన కనేక కావ్యములవలనఁ దెలియుచున్నది.' (కవితరంగిణి-6సం189 పుట)

తన కావ్యములను నరాంకితము చేయని పోతన భోగినీదండకము నెట్లు రచించెనని కొందఱు శంకింపవచ్చును. వీరభద్రవిజయ-భాగవతములను రచించిన పోతన భోగినీదండకము నద్గ్రంథముగాఁ దలంపను లేదు. సింగభూపాలున కంకితమిచ్చె

కర్పూర తాంబూల జాంబూనదాభరణంబులను గ్రహింపను లేదు. సింగభూపాలుండు వేశ్యాలోలుం డగుట తెలిసికొని, యతనికి నీతిం జెప్పుటకై పోతన యీదండకము వాసువుగాం జెప్పె ననియు భోగినీ దండకమును విన్న సింగభూపాలుండు సిగ్గుచెంది పోతనగారికిం బాదాభివందన మాచరింపంగా –

రసికులైనవారు రమణుల కోకవేళ
కంగుటెల్ల భర్తృకలు రసంబు
ఈ రసమున విల్లనారిక వంగడా?
చిత్తజాతమూర్తి! సింగభూప!

అని పోతన బదులు చెప్పె ననియుం బెద్దలు చెప్పెదరు. అందువల్లనే దండకములో 'రాజుల్ బహువ్యాజులే. వీత మర్యాదులే' యనుట సంభవించినది కాంబట్టి పోతన భోగినీదండకమును రచించుట నిర్వివాదము.

## దండక విశేషములు

పోతన మహాకవి యాంధ్ర వాఙ్మయములోం బ్రత్యేక దండక కృతి రచన కాద్యుండు. ఆంధ్ర సాహిత్యము నందలి దండకములలో భోగినీదండకము మిక్కిలి పెద్దది. ఈ దండకము నందు శృంగార వర్ణనములు గాని, యశ్లీలపద ప్రయోగములు గాని లేవు. ఇందు రేచర్ల వంశీయులకుం గల 'రాయచౌహత్తమల్ల', 'గాయగోవాళ' 'రాయవుండాల పార్వతీష' మొదలగు బిరుదములు పేర్కొనబడినవి. సింగభూపాలుండు పాండ్యభూపాలాది రాజులను జయించు యే కాక యతండు 'భాషా విశేషంబుల శేషుతోనైన భాషించు' 'వాణి వాణిని మహావాణి కాపున్న' దని పండితుండుగా వర్ణింపంబడినాండు.

పోతన మహాకవి 'ప్రమోషించు' నను పదము నిం దెక్కువగాం బ్రయోగించినాండు. శబ్దరత్నాకరము నందీ పదము

(తరువాయి 9వ పేజీలో చూడుడు.)

# బాపిరాజుగారి భాష - శైలి

– శ్రీ బి. సిమ్మన్న ఎం. ఏ, పిహెచ్. డి,

భాషా సౌందర్య పరిపోషణలో, శైలీ విన్యాసంలో బాపిరాజుగారు సిద్ధహస్తులు. భాషలో, శైలిలో ఆయన ప్రదర్శించిన శిల్పచాతుర్యం అనన్య సామాన్యం.

"బాపిరాజు కల్పనలు మనల్ని మనోజ్ఞ జగత్తులోకి తీసుకొనిపోయి ఆనందపరచును అనుకుంటే ఆయన భాషకూడా వ్యాపకంగమైంది. ఆయన శబ్దలాలిత్యమే మనలను పరవశం పొందింపచేసేది. ఆయన ప్రధమంగా కవి, అటు తర్వాత చిత్రకారుడు. ఆయన కథలన్నిటా కన్పించేది కూడా అదే. ఆయన వస్తువుకంటే మనలను అధికంగా ఆకర్షించేది ఆయన భాషే"! బాపిరాజుగారి కథల్ని ఎరుగని వారుండరు. ఆయన భాష మృదుమధురంగా, సరళసుందరంగా, సౌకుమార్యంగా, కమనీయంగా ఉంటుంది వీరి వచన రచనలోని భాష, ముక్కుమొగాడు లేని లాక్కుపోయి నట్లు ఉంటుంది. అందుచేతనే "బాపిరాజుగారి భాష కొండచరియలలో ప్రవహించే సెలయేరు వంటిది" 2 అని శ్రీ మందలి నాగభూషణశర్మగారు రాశారు. ఆయన భాషలో వచన రచనలో ఆకనికి ఉన్నత స్థానాన్ని కలుగజేశాయి.

వీరు తమ కథాసాహిత్యంలో వ్యావహారిక, గ్రాంథిక భాషలు రెండింటినీ వాడారు. సాంఘిక కథల్ని వ్యావహారిక భాషలోను, చారిత్రక కథల్ని గ్రాంథిక భాషలోను వ్రాశారు.

## పాత్రోచిత భాష.

వీరు తన కథల్లో ఆయా పాత్రలకు అనుగుణంగా పాత్రోచిత భాషను ప్రయోగించి పాత్రలకు తద్వారా కథలకు సహజత్వం కలుగజేశారు. ఆయన సజీవ పాత్రల్ని సృష్టించి, పాత్రపోషణలో పతాకస్థాయికి చేరుకున్నారు. గుడ్డిపిల్ల కథలో బిచ్చగాడి భాష ఇందుకు పరమోదాహరణం.

"మీరు చల్లగా వుండాలి, నేను పచ్చగా వుండాలి, మీ ధాన్యాలు బాగాది నిండాలి, మీ నవ్వులోంచి ధనవర్షం కురియాలి. బాబూ! విజయీభవ!! దిగ్విజయీభవ!!! మీరెప్పుడూ రైలు ప్రయాణం చేస్తూ వుండాలి బాబూ! 3

## శైలి.

'శైలి' అనుపదం తెలుగులో 'స్టైల్' అనే ఆంగ్లపదానికి సమానార్థకంగా వాడబడుతుంది. 'మాట్లాడేటప్పుడు గాని, వ్రాసేటప్పుడు గాని, వ్రాసేటప్పుడు గాని భాషాభివ్యక్తి (*Linguistic expression*) లో కనబడే తీరును శైలి (*Style*) 4 అంటాం. ఇది వ్యక్తిగతమైంది ఆయా రచయితల వ్యక్తిత్వం ఆయా కథల్లో మనకు సుస్పష్టంగా కనబడుతుంది రచయిత వ్యక్తిత్వానికి 'శైలి' అద్దం వంటిది.

"బాపిరాజు శైలి ఉప్పొంగిపోయిన గోదావరి వంటిది. వేగానికి గాని, ఉత్తేజపరచడానికి గాని అది అప్రతిమానమైనది. సందర్భానుసారం శైలిని మార్చడంలోనూ, పాత్రానుగుణమైన భాషను వాడడంలోను మహాశక్తిపరుడు బాపిరాజు" 5 ఆయన కథల్లో ఎక్కడైనా ఒక 'పేరా' తీసి, ఇది ఎవరి శైలిలో చెప్పండి అంటే బాపిరాజుగారి శైలి అని యిట్టే చెప్పవచ్చు. ఆయన స్వయంగా చిత్రకారులు కావడం వల్ల ప్రతి విషయాన్ని సుందరంగా అక్షరాలతో చిత్రాలు గీయాలని ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నమే ఆయన శైలి

రమ్యతకు ప్రత్యేక కారణమైంది. ఇదే బాపిరాజుగారి శైలిలోని ప్రత్యేకత.

ఆయన శైలి మిక్కిలి మనోహరమైంది. సహృదయాహ్లాదకర మైంది. 'భావుకులైన సహృదయులను బాపిరాజుగారి శైలి ఆకర్షించిన శైలీదియు నాకర్షింపలేదు.'6 వీరి శైలిని ఆఖ్యాన శైలి, నాటకీయ శైలి, వర్ణనాత్మక శైలి, భావనాత్మక శైలి అనే నాలుగువిధాలుగా విభజించవచ్చు.

## ఆఖ్యాన శైలి.

ఆఖ్యాన శైలినే కథన శైలి అనవచ్చు. ఇందులో కథ చెప్పడమే ముఖ్యం. బాపిరాజుగారు సర్వ లలితకళా ప్రియులు. సౌందర్యోపాసకులు. అందువల్ల ఆయన ఆఖ్యాన శైలి లలితంగా ఉంటుంది. 'వసుపాలుడు' కథలో శివశంకరరెడ్డి, తన కుమారుడు వసుపాలుడు రోజు రోజుకు చెడిపోతున్నాడనే ఉద్దేశాన్ని, సేనా నాయకుడైన తిమ్మన్న నాయకునితో తన విచారాన్ని, వ్యక్తం చేస్తాడు. 'అబ్బాయికి యుద్ధం అంటే ఏమీ ఇష్టం లేదా? ... ఒక్కడూ మాపటుకోలేక పోయేవాడు' 7 ఈ సంభాషణ ఆఖ్యాన శైలికి చక్కని ఉదాహరణ.

## నాటకీయ శైలి.

బాపిరాజుగారి శైలి హృద్యంగా ఉంటుంది అందుకు కారణం నాటకీయ శైలి. ఎక్కడ పాత్రల ముఖంగా కథ నడుస్తుందో, అదంతా నాటకీయ శైలిలోకి వస్తుంది. దీన్ని సంభాషణ శైలి అనవచ్చు. ఆయా కథల్లో కథకు అనుగుణంగా చర్చించిన విషయమంతా నాటకీయ శైలికి సంబంధించిందిగా గ్రహించవచ్చు. వీరి కథల్లో నాటకీయ శైలి కొట్టవచ్చేట్లు కనబడుతుంది.

'వింధ్యాచలం' కథలో చతుర్వేది భాషా ప్రయుక్త రాష్ట్రాలు వచ్చి తీరాలి అని వాదిస్తాడు. త్రిపాఠి భాషాప్రయుక్త రాష్ట్రాలు అనే భావన సకల భారత దేశానికి ఒక మహాశక్తితో విజృంభించడానికి అన్ని విధాల అడ్డు అని వాదిస్తారు. అప్పుడు వాళ్ళ సంభాషణ నాటకీయ శైలిలో నడిచింది. 'ఉన్న భావాలు తీసివేయలేము ... స్పష్టంగా తెలుస్తున్నవి.' 8

## వర్ణనాత్మక శైలి.

వీరి శైలి వర్ణనాత్మకమైంది. ప్రతి చిన్న విషయాన్ని నఖశిఖ పర్యంతం వర్ణించనిదే తృప్తి చెందరు. ఎక్కడికక్కడే నగిషీలు చెక్కుతూ సౌందర్య వంతంగా వర్ణించుతారు. అందువల్ల ఆయన శైలిలో సౌందర్యం, సౌకుమార్యం రెండూ చోటు చేసుకున్నాయి. ఆయన వర్ణన అనితర సాధ్యం. వీరి శైలిని అనుకరించడం కష్టం. వ్యుత్పత్తి, ప్రతిభ, ప్రజ్ఞా పాండిత్యాలున్న వారికి మాత్రమే ఇటువంటి శైలి అలవడుతుంది. 'అసురకన్య' కథలో పాంచర సౌందర్యాన్ని 'ఆ బాలిక సౌందర్యము... లోయలలో ప్రవహించే ఏకస్త్రావది ప్రవహింపులా ఉన్నది' 9 అని మనోజ్ఞంగా వర్ణించారు.

## భావనాత్మక శైలి.

వర్ణనా శైలి కన్నా భావనాత్మక శైలిలో ఎక్కువ సౌందర్యం ఇమిడి ఉంటుంది 'వసుపాలుడు' కథలో అరవింద సౌందర్యాన్ని తనకు గల భావనా పటిమతో రమణీయంగా వర్ణించారు. 'ఆమె బంగారు ఛాయలో స్వర్ణనది ప్రవాహ రేఖలు పోల్చుకొన్నాడు. ...ఆమె పెదవులలో అప్సర హాస్యాంచిత లీలా కమల మాధుర్యాలు రూపొందాయట' 10

## కవిత్వస్థాయి.

బాపిరాజుగారు ఉత్తమ కథకులే కాక ఉత్తమ కవి కూడా. అందుచేత అతని రచనలో కావ్యగుణం కమనీయంగా కనిపిస్తుంది. స్త్రీని వర్ణించినప్పుడో, పురుషుని వర్ణించినప్పుడో, ఒక సన్నివేశం వర్ణించినప్పుడో, లేదా వాతావరణాన్ని వర్ణించినప్పుడో ఆయన కవితాగుణం బయటపడుతుంది. ఇటువంటి చోట్ల బాపిరాజుగారు మనకు కథకుడుగా కాక కవిగా కన్పిస్తారు. 'సంధ్యానృత్యం' కథలో అరవింద నృత్యం చేస్తున్న దృశ్యాన్ని 'అవి హిమధవళ పదాలు ... ఆ తాండవం అమృత తాండవం' !! అని కళ్ళకు కట్టినట్లు వర్ణించిన తీరు, కవితా గుణానికి నిదర్శనం.

## కథల్లో గేయాలు.

వీరు సోమసుత, సూర్యముఖి, వాన, గుడ్డిపిల్ల, గాలివాన, నాగలి, నాగేటిచాలు, సంధ్యా నృత్యం, శైలబాల, బండరాళ్ళు, కర్ణలీలం, అడవిమల్లె, మామిడితోపు మొదలైన కథల్లో సందర్భాను సారంగా పాడుకొనుటకు వీలుగా అతి మనోహరంగా గేయాలు వ్రాసారు. ఈ గేయాలు ఎక్కువగా ప్రణయ సంబంధమైనవి. జానపద గేయాలు కూడా అక్కడక్కడ ఉన్నాయి.

## గేయాల్లో కథలు.

కథల్లో గేయాలు వ్రాయడమే కాక గేయరూపంలో కూడ కథలు వ్రాశారు. తన అముద్రిత గేయసంకలనంలో 'గుడి' అనే శీర్షిక పెట్టి జంగం కథను కడు హృద్యంగా వ్రాశారు.

## సుదీర్ఘ వాక్య నిర్మాణం.

సుదీర్ఘ వాక్యనిర్మాణం అతని శైలికి మరింత సౌందర్యాన్ని చేకూర్చింది. 'నాగచంద్రుడా బాలిక మాటలు వింటూ, సంభ్రమాశ్చర్యాలకు లోనౌతూ, తుంగభద్ర నీళ్ళు చిన్నట్లు తొలుస్తూ ఉండడం కనుగొంటూ, ప్రణయ పూజా సేవకుడౌతూ, ఆ బాలిక అందాల మోము పరికించి

(6 వ పేజీ తరువాయి)

'లేదు. సూర్యరాయాంధ్ర నిఘంటుకర్తలు 'ప్రమోషించు 1. మోసగించు, 2 దొంగిలించు' నని యర్థముల నిచ్చి యీ భోగినీ దండక ప్రయోగములనే ప్రమాణముగా నుదాహరించినారు 'విచారంబు లేదే? శుభాకార యేలే?' 'ఏలనే? గోలనే'యని యేల శబ్దము కళగను, ద్రుతప్రకృతికము గను గూడ నిందుc బ్రయోగింపcబడినది. ఇట్టి తక్కిన విశేషములను శారదు తెలుంగకలయును ఈ భోగినీదండకము ననుసరించి చంద్రకవి 'పద్మావతీ దండకము', నుదురుపాటి సాంబకవి 'చంద్రాననా దండకము', లక్ష్మీదాసకవి 'పద్మినీ దండకము', గణపవరపు వేంకటకవి 'విద్యావతీ దండకము' మొదలగునవి వెలసినవి.

భోగినీదండకమునకు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందును, వెంకటగిరి సంస్థానము నందును, కాకినాడ యాంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునందును వ్రాతప్రతు లున్నట్లు తెలియుచున్నది. వావిళ్ళవారు దీనిని ప్రకటించినట్లు తెలియుచున్నది. గాని యది వారికి లభింపలేదు భోగినీదండకము కొఱకు మిక్కిలి ప్రయత్నము చేయుచుండcగా 'గండకగుచ్ఛ' మను నొక గ్రంథములో నిది లభించినది శ్రీమండరాజయ్యగారి కోరికపై శ్రీకాముశరపు సూర్యనారాయణగారిచే రచింపcబడిన భగవద్దండకములను, ప్రాచీన కవి దండకములను చేర్చి 'కారపట్టు' గ్రామవాస్తవ్యులు బ్రహ్మశ్రీ పురాణపండ భావన్న అవధానులు గారు 'దండకగుచ్ఛము'ను ప్రకటించిరి. ఈ గ్రంథము 1952 లో 'నాయుమూరు' నందలి వెంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్సు నందు ముద్రింపcబడినది. ఇందలి భోగినీదండకమును పఠింపcగనే యమందానందము కల్గినది ఈ దండక గుచ్ఛ గ్రంథము కూడ శిథిలావస్థలో నున్నది నేcడు సాహిత్య ప్రియులకుc బోతన మహాకవి భోగినీదండక మందుబాటులో లేదు దీనిని ప్రకటింపవలెనని కోరిక యెన్నాళ్ళ నుండియో నాకు కలదు.

భోగినీదండకమును గూర్చి ప్రస్తావించిన వెంటనే తమ 'సమాలోచన' పత్రికలోc బ్రకటించుట కంగీకరించిన క్రమాంత స్వాధ్యాయులు బ్రహ్మశ్రీ ఇలుసు సీతారామశాస్త్రి గారికి, 'దండకగుచ్ఛము'లో దీనిని చేర్చి పాఠకుల కందించిన బ్రహ్మశ్రీ పురాణపండ భావన్నావధానులుగారికి నా కృతజ్ఞతాభివందనములు.

* * *

# కందుకూరి ప్రహసనాలు జుగుప్సాకరమైనవి

— డా. ప్రకాశచంద్ర శతపథి.

లోకంలో వ్యాప్తమౌతున్న చెడును ప్రోత్సహిస్తున్న వ్యక్తులను, వారి కుత్సితాల్ని, కుయుక్తుల్ని, ఆయా కాలాల్లో గల వృత్తిపరుల మోసాల్ని హృదయోల్లాసకరముగ వివరించి సిగ్గుపడేట్లు చేసి, దుర్లక్షణాలు విడనాడుటకు ఉద్యమింపచేయుట మహాశయముగా గలది ప్రహసనము. వ్యాధితులనుచికిత్సించుటలో కూడా వీటిని ఉపయోగించినారు.

సమాజములో గల బలహీనతలను సున్నితమైన హాస్యముతో ఎత్తిచూపి; దురాచారాలకు, దుర్వ్యసనులకు, సిగ్గుకలిగించి, క్రమశః సమాజములో అట్టి దౌర్బల్యములు సన్నగిల్లువిధముల భావన చేసి రచించు రచనలు ఉపహాసములు (ఆంగ్లములో *Satires*.) ఈ ఉపహాసములకు పెట్టినది పేరు కాశ్మీరదేశవాసి క్షేమేంద్రుడు 11వ శతాబ్ది వ్యక్తి. ఈ మహనీయుడు 'కళావిలాసం' 'దేశోపదేశం' నర్మమాల' అను 8 ప్రధానమైనవి రచించాడు. ఆయన ఉపహాస రచనలు అనగా ప్రహసనములను గూర్చి వివరిస్తూ —

హాసేన లజ్జితోఽత్యంతం
న దోషేషు ప్రవర్తతే।
జనస్తదుపకారాయ
మమాయం స్వయ ముద్యమః'

— మనుజునిలో గల దోషాలను సున్నితంగా పరిహసిస్తే అతడు లజ్జ పొంది క్రమంగా ఆ దోషగుణములనుండి వైదొలగుతాడు. అందుకోసమే నేనీ రచన మొదలిడుతున్నాను అని క్షేమేంద్ర మహాకవి వాకొనినాడు. దర్పదలనమ్, సేవ్యసేవకోపదేశః, సమయ మాతృక, కూడా వీరివే. 7వ శతాబ్దిలో కాంచీపురాన్ని పరిపాలించిన మహేంద్ర విక్రమవర్మ 'మత్తవిలాసం' అనే ప్రహసనం రచించాడు. దొరికిన ప్రహసనాలలో మొట్టమొదటి దదే అందుకు ఇందు ఒక కపాలి, ఒక బౌద్ధభిక్షువు, ఒక ఉన్మత్తుడు, ఒక వేశ్యాంగన, ఒక పాశుపతుడు - వీరల నడుమ ఇతివృత్తం కొనసాగుతుంది. 'భగవదజ్జుకం' అన్న ప్రహసనం కూడా మహేంద్రవర్మ దనే వాద మున్నది. అలాగే 'లటకమేళకం' శంఖధరుడు (12వ శతాబ్ది) రచించినది

వీరి ప్రహసన రీతి—

'వ్యాధయో మదుపచార లాలితాః
మత్ప్రయుక్త మమృతం విషంభవేత్।
కిం యమేన సరుజాం కిమాప్తైః।
జీవహర్తరి పురఃస్థితే మయి॥
(లటకమేళకం)

— వ్యాధులు నా పెంపుడు పిల్లలు. నేను అమృత మిచ్చిన అది విషమౌతుంది అనాయాస మృత్యువును చేకూర్చడంలో అందెవేసిన చేయి నే నుండగా — ఈ

యముడూ, గిముడూ ఎందుకు? అని ఒక వైద్యశిఖామణి చికిత్స చేయ నేతెంచిన ప్రాశస్త్యాన్నిలా ఎగ్గడిస్తాడు. క్షేమేంద్రుడు 'కళావిలాసం'లో - వాణిజ్యవేత్తలను అవహేళన చేయుమా-

'హృత్వార్థం జనానాం దినముఖిలం
వివిధ కూట మాయాభిః
ఖతరతి గృహే కిరాటః
కష్టేన వరాటక త్రితయం'

— అనేక విధములైన మోసములు చేసి పగలంతా ప్రజల డబ్బంతా దోచుకొని, స్వగృహానికి వెళ్ళిన తదుపరి వర్తకుడు అతికష్టం మీద మూడు చిల్లిగవ్వలను దానం చేస్తాడు

గీర్వాణ వాఙ్మయంలో ప్రకరణం, ప్రహసనం, భాణం అనే మూడు విధములైన వాటిలో సాంఘిక స్థితిగతులను వివరిస్తూ, వ్యంగ్యముగా హేళన చేసే పద్ధతి యున్నది. రాజమహేంద్రవరములో ప్రహసనాలు కందుకూరి వీరేశలింగంగారే కాక పానుగంటి లక్ష్మీనరసింహంగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, భమిడిపాటి కామేశ్వరరావు గారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు రచించారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారి ప్రహసనాల్లో కటుత్వముంది. పానుగంటి, చిలకమర్తి, భమిడిపాటి రచనల్లో హాస్యం, సంస్కారం, ప్రబోధం, అవహేళనా యుక్తంగా, హృద్యంగా వుంటాయి. భారతీయసంస్కృతిని సంస్కృతి పరువు కందుకూరివారి ప్రహసనాల్లో మోటుతనం, అశ్లీలత, అనౌచిత్యం, అసంస్కారం, అసభ్యత దోబూచులాడుతాయి. భారతీయ శాస్త్రాల్ని, ఆచారాలు పనిగట్టుకొని కించపర్చడం, తూలనాడడం అడుగడుగునా అగపడుతుంది. అందుచే అవి ప్రాచుర్యం పొందలేదు. క్రైస్తవులకు, మహమ్మదీయులకు హిందూ మతాన్ని, హిందూ సంస్కృతిని, ఆచారాలను తూర్పారపట్టుట కుపకరించినవి. ఆసిభట్ల వారిది హాస్యభరితము.

### హాస్యకథలు పూర్వం లేవా?

పూర్వం క్షేమేంద్రుడు, మహేంద్ర వర్మల, కాలానికి మాత్రమే గాక, అంతకు పూర్వం కూడా ఇలాంటివి వున్నాయి. అగ్నివేశసంహిత (చరకం) ఉన్మాదాధికారమున గంధర్వ గ్రహోన్మాద లక్షణములను వివరించుతరి—

'చణ్డం సాహసికం తీక్ష్ణం గంభీర మప్రధృష్యం ముఖ వాద్య నృత్య గీతాన్న పాన స్నాన మాల్యధూప గంధరక్త వస్త్ర బలికర్మ 'హాస్యకథా' యోగ ప్రియం శుభగంధ మితి గంధర్వోన్మత్తం విద్యాత్'

— గంధర్వోన్మాదమందు నోటి వాయిద్యము, నృత్యగానాదులతో పాటు హాస్యకథలయందు ఇష్టముగ నుండు నని వివరించబడినది. మదాత్యయాధికారమున(చరకం) ప్రథమ మదలక్షణములను వివరిస్తూ—

'ప్రహర్షణః ప్రీతికరః
పానాన్న గుణ దర్శకః।
వాద్యగీత ప్రహాసానాం
కథానాం చ ప్రవర్తకః॥ ..'

— నవ్వు పుట్టించు కథలను చెప్పుట తెలుపబడినది. ప్రహసనమును కల్పించు కవులు అనాది నుండియు భారతమున గలవు. అవి నవ్వులాటకే చేయుటకగు నట్టివే కాని, దూషణములకు, దుర్విమర్శలకు ఆకరములు కారాదు. జుగుప్సాకరముగ నుండరాదు. మరి వీరేశలింగం గారి ప్రహసనం పరికించండి.

సాధారణంగా ప్రహసనం పరిహాసజనకంగా నుండును. కందుకూరి వారి ప్రహసనములలో పరభాగ మగపడదు. పరాకారమే నిండియుండును. పరిపత్తు వెదజల్లినట్లుండును. పరిహాసము గపడదు. పరిభాషణ పనిగట్టుకొని చేయుటగ పడును.

భారత ధర్మశాస్త్రాలలో వివాహాలు 8 రకములుగా పేర్కొనబడినవి. 1. బ్రాహ్మవివాహము 2. ప్రాజాపత్యవివాహము 8 ఆర్ష వివాహము, 4 దైవవివాహము 6 ఆసురవివాహము 7. రాక్షస వివాహము 8. పైశాచ వివాహము ఇందు మొదటి 4 వివాహములు ధర్మ్యములై ప్రశస్తమైనవిగా 'చత్వారో ధర్మ్యాః ప్రథమాః' - అని గౌతమమహర్షి (1 4-12) 166 సూత్రమున తెలిపినారు. అందు మొదటిదైన బ్రాహ్మ వివాహము 'బ్రాహ్మో విద్యా చార త బంధుశీల సంపన్నాయ దద్యాదాచ్ఛాద్య అలంకృతాం' (1 4-4) 159 సూత్రం

విద్యావంతుడు, చరిత్ర గలిగినవాడు, బంధుసంపత్తి కలిగినవాడు, శీలసంపత్తి కలిగినవాడు నగు వరునకు తనకన్యకను కన్యకను వస్త్రాభరణాదులచే నలంకరించి ఒసంగవలసినది (సాలంకృత కన్యాదానం)అని బదులు ఇదే బ్రాహ్మవివాహము హిందువులంచుమించు అందరు చేయు వివాహ మిది. ఇందు విపరీతముగా కట్నము లాగుట కాని, వరుడు వధువు తల్లిదండ్రులను పీడించుట గాని, వధువుల నెవరికో ఒకరికి దారినపోయే దానయ్యలకు ముసలి ముసలికి కట్టబెట్టుట గాని జరుపుట లేదు. పైగా వివాహవ్యవస్థలో వధువునకు 16ఏండ్లు, వరునకు 25ఏండ్లు ఉన్న వారే మిథునకర్మ కర్హులుగా వైద్య ధర్మ శాస్త్రాలు తెలిపినవి. పెద్ద వ్యత్యాసము ఉండరాదు. ధర్మశాస్త్రాలిరీతి నుండగా దురాచారములు, పడుచు పిల్లను వృద్ధుల కిచ్చుట జరిగిన జరుగుచున్నమాట కాదనలేము. విధవావివాహములకు ఉద్యమించిన కందుకూరి వారు పరాశరుడు తెల్పిన 'నష్టే మృతే' శ్లోకాన్నాధారముగ గొని ఉద్యమించినవారు. ఏనుగుల వీరాస్వామయ్య గారికి కె-ధర్మ శాస్త్రమునందీ అనాచారములు తెల్పబడలేదు. స్మృతి శ్రుతి గర్హితములని

తెల్పుట మాని ఆర్ష ధర్మాన్ని, వైదిక మతాన్ని కించపరచి క్రైస్తవులున్నగు వైదికేతరులను సంతోషపరచి, భారత ధర్మాన్ని కించపర్చి పవిత్రమైన, ధర్మబద్ధమైన బ్రాహ్మవివాహమును అవహేళన చేయు అదే శీర్షికతో 'బ్రాహ్మవివాహము' అను ప్రహసనము రచించినారు. దానికి మరోపేరు పెద్దయ్యపెండ్లి. ఈ ప్రహసనమున 10 ఏండ్ల బాలికను ఒక ముసలికి డబ్బు కాశించి ఆ పిల్ల తల్లిదండ్రులు పెళ్ళిచేసి - వివాహమైన తరుపరి ఆ 10 ఏండ్ల బాలికను, ఆ ముసలి వరుని గర్భాధానపు గదిలోనికి పంపుట. తరువాతి వ్రాత ఉచ్చరించ వీలులేనిది. అశ్లీలమైనది. అసలు రజస్వల గాని 10 ఏళ్ల బాలికను గర్భాధానపు గదిలోనికి పంపు ఆచారము ఎంతటి హీనాతి హీనమైన బ్రాహ్మణ శాఖలోనైన గలదా? బ్రాహ్మణులే యన నేల? ఏ కులమునందైనా తెలుగు నాటకలదా? దురాచారము-ధర్మేతరముగా జరిగినదానిని-మార్పించవచ్చు. దాని కిదా రీతి? బ్రాహ్మణత్వాన్ని, భారత ధర్మశాస్త్రాల్ని పరిహసించుట కదా వారనుసరించవలసినది?

అసలు బ్రాహ్మ వివాహములో ప్రసహ్యతకు (బలాత్కారమునకు) తావే లేదు. బలాత్కారముగా చేయుబడు వివాహము 'ప్రసహ్యదానా ద్రాక్షసః' రాక్షస వివాహ మనబడును గాని బ్రాహ్మవివాహ మనబడదు. కన్యకయొక్క తల్లిదండ్రుల నుండి బలాత్కారముగ కన్యకను లాగుకొని తెచ్చిచేయునట్టి వివాహము రాక్షస వివాహము. ఏరకమైన వివాహమునకు ఆ పేరు వ్యవహరింపవలసినదీ కూడా వీరేశలింగంగారికి తెలియదనాలా?

1876 జూలై నెలలో వివేకవర్ధని పత్రిక కనుబంధంగా 'హాస్యసంజీవని' పేరిట మాసపత్రిక ప్రచురించారు వీరేశలింగంగారు. బ్రాహ్మవివాహ ప్రహసన మిందే ప్రకటింపబడినది. ఈ బ్రాహ్మ వివాహము గూర్చి స్వీయచరిత్ర చతుర్థ ప్రకరణమున 101 పుటలో వీరేశలింగం ఇలా వ్రాశారు

అతి బాల్యవివాహములు, అతివృద్ధ వివాహములు, కన్యాశుల్కము మొ॥ వాటివలని యనర్థములను బోధించుటకై బ్రాహ్మవివాహము ప్రకటింపబడినది. అది చదువుకొను వారియొక్క వేడుక కొరకు మాత్రమే వుపయోగపడెను గాని యంతకంటె నెక్కువ ప్రయోజనము దానివల్ల కలుగలేదు'

74వ పుటలో—(తృతీయ ప్రకరణం)

'నా బ్రాహ్మవివాహ మీ పత్రికయందే (హాస్యసంజీవని) ప్రథమమున వెలువడ నారంభించెను. అట్టి వ్రాత కదియే తెలుగు భాషయందు మొదలగుటచేత ఆదినములం దెక్కడ జూచినను మూకలు గట్టి జనులు హాస్యసంజీవనిని, ముఖ్యముగా నందులో బ్రాహ్మవివాహమును చదివి యానందించుచూ వచ్చిరి. రెండేండ్లకుదరువాత (అనగా 1878 సం॥) నేనొకసారి బందరు పురమునకు బోయినప్పుడొక బ్రాహ్మణబాలిక బ్రాహ్మ వివాహమును మొదటినుండియు తుదివరకును నప్పగించి నాకాశ్చర్యము కలిగించినది.' అని కందుకూరివారు పేర్కొన్నారు. వారి అభిరుచి ఎట్టిదో తెలియజెప్పు విషయ మిది. అసహ్యము, అసభ్యము, అనౌచిత్యము, అశ్లీలమైన ఈ బ్రాహ్మవివాహ రచన ఎంతటి మన్ననలనో పొందినట్లు, కడకు ఒక బ్రాహ్మణబాలిక కూడా దీన్ని వల్లెవేసి అప్పగించిన దని చెప్పడం వారి నీచభావుకతను తెల్లపుడు చేయుచున్నదనిన; అవద్యపు పలుకు అనిన, సత్యేతర మగునా?

## బ్రాహ్మణ – అబ్రాహ్మణ వివాద సృష్టి –

తాను బ్రాహ్మణత్వాన్ని, స్మృతుల్ని, శాస్త్రాల్ని తన యిచ్చవచ్చిన రీతిని విమర్శించి తూలనాడిన పంతులుగారు తాను చదువుకొన్న బ్రాహ్మడి నని ఒకటికి పదిసార్లు చెప్పుకున్నారు. కులాల పట్టింపులేని బ్రహ్మసమాజం వాడనంటూ తన ప్రాపకమునకై తన ప్రతికక్షులు శూద్రులని, బ్రాహ్మణుడ నగుటచే తనపై వ్యాజ్యం వేశారని, అల్లరి పెట్టారని చెప్పడానికి కూడా సాహసించారు. చూడండి స్వీయచరిత్ర 25 పుట.

'మా వ్యవహారములో సాక్షుల విచారణ మారంభ మయినది. నా ప్రతిపక్షమున వచ్చిన సాక్షులలో కొందరు మిత్రరక్షణ తత్పరత్వము చేతనో, ధారణాశక్తి లోపము చేతనో నేను తమతో ననని మాటలను కూడా కొన్నింటిని నే నన్నట్లు తమ సాక్ష్యములలో జెప్పిరి. అందుచేత దండనాధికారి వారి సాక్ష్యమును విశ్వసించక పోవుట సహితము తటస్థించెను. నేను బ్రాహ్మణుడను. లక్ష్మీనరసింహం గారు బ్రాహ్మణేతరుడు నగుటచేతను, వివాదము మాలో మాకు కలిగిన విశేష వివాదమే యయినను బ్రాహ్మణులకును, బ్రాహ్మణేతరులకును సంభవించిన సామాన్య వివాదముగా గల్పించి, నా ప్రతిపక్షులును తన్మిత్రులుం గొందరును తమ పక్షమును బలపరచుటకయి పాటుపడి కొంతవరకు సఫలమనోరథులైరి. కాని సంపూర్ణ మనోరథ సాఫల్యమును బొందజాలరైరి బంధువులయొక్కయు, కులము, వారియొక్కయు నిర్బంధము సరకుగొనక బ్రాహ్మణేతరులలో ననేకులు నా పక్షమున సాక్ష్యమిచ్చిరి.

ఏలూరి లక్ష్మీనరసింహంగారు బ్రాహ్మణేతరుడు గనుక వారే ఆయనని బలపర్చి, బ్రాహ్మణులు ఆయన్ని బలపర్చనట్లు తప్పుడు భావన కలిగేటట్లు, బ్రాహ్మణేతరులలో కూడా తనకు నుకూలురున్నట్లు మరలా వ్రాశారు. ఇతర్లని కించపరచి అనీతిపరులుగా చిత్రించి, తా నేదో నీతి

పడుచునని రమాపతిరావుగారు వంటివారు శ్లాఘించి యుగపురుషుడుగా కీర్తించాలనే దుంభకవ, దురాలోచన అగపడుతుంది. కానీ చిలకమర్తి ఏమి వ్రాశారో స్వీయచరిత్రలో పరిశీలించండి

ఏలూరి లక్ష్మీనరసింహంగారు కందుకూరిపై వేసిన వ్యాజ్యమును గూర్చి ఇలా వ్రాశారు. అప్పటి జిల్లా జడ్జిగారైన రాసు గౌరగారు విచారణ చేసి పరువునష్టం క్రింద ఏలూరి లక్ష్మీనరసింహం గారికి ఒక రూకా యిప్పించిరి ఈ తీర్పు 1893 సంవత్సరంలో జరిగెను ఆ తీర్పు జరిగినప్పుడు నేను జిల్లాకోర్టుకు వెళ్ళి స్వయముగా తీర్పుమాట కనుగొని వచ్చితిని. ఏలూరి లక్ష్మీనరసింహంగారి పక్షమున మహారాజశ్రీ నిడమర్తి జలదుర్గాప్రసాదరాయుడుగారు వాదించిరి. వీరేశలింగం గారి పక్షమున మహారాజశ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారు గట్టిగ పట్టుపట్టి పనిచేసిరి. రాజమహేంద్రవరములో నున్న వారేకాక, జిల్లాలోనున్న పెద్దమనుష్యులనేకులు వచ్చి మా పక్షమునకో, యీ పక్షమునకో సాక్ష్యములిచ్చిరి.

ఆ దినములలో మా పట్టణమున (రాజమహేంద్రవర మన్నమాట) రెండు పక్షము లేర్పడినవి వీరేశలింగంగారి పక్షము కొందరు, లక్ష్మీనరసింహం గారి పక్షము కొందరు. మా నాటక సమాజములో నున్న యువకులు లక్ష్మీనరసింహం గారి పక్షమే. నేనే వీరేశలింగంగారి పక్షమున నుండెడివాడను. మా హనుమంతరావు నాయుడుగారు (పశ్చాత్కాలం గాంధర్వ - స్వామి) వీరేశలింగం గారికి ప్రతికూలముగా లక్ష్మీనరసింహం గారి పక్షమున సాక్ష్యమిచ్చిరి. నేను మనసులో నంతరము వీరేశలింగం గారికే విజయము కోరుచుంటిని కాని నాకు లక్ష్మీనరసింహంగారితోను పరిచయము కలదు. చిలకమర్తిని వారు మున్సిపల్ అధ్యక్షులుగా నుండగ ఉపాధ్యాయునిగ నియమించిరి.) అప్పుడప్పుడు నేను వారి యింటికి కూడా హనుమంతరావునాయుడు గారితో కలిసి పోవుచుండెడివాడను. లక్ష్మీనరసింహంగారి యందును కొన్ని ప్రశంసనీయమైన గుణము లుండెడివి. ఆయన యాపద్బాంధవు డనియు, సర్వజనమిత్రు డనియు, సులభుడని యు చెప్పుకొనుచుండెడివారు. (స్వీయచరిత్ర 109. 110 పుటలు) మరి కందుకూరి దుస్థితి, ఆయన శిష్యుడైనా చిలకమర్తి వ్రాతని బట్టి తెల్లమగుట లేదా! చిలకమర్తి కుద్యోగమిచ్చిన యేలూరివారు చిలకమర్తి తన ప్రత్యర్థియైన కందుకూరి పక్షమున నిలిచినా, గౌరవాదరములు చూపుచుండుట అసలు ఈ వ్యాఖ్యమునకు కారణము. కందుకూరి తన వివేకవర్ధనిలో నీచాతినీచంగా ఏలూరిని అపహాస్యం చేస్తూ ప్రహసనం ప్రచురించారు తన ఉద్యమాలన్నింట ఏలూరి ఇచ్చిన ప్రోత్సాహము వలన ప్రఖ్యాతి గాంచినవారు కందుకూరి. తనకన్న విద్యావంతులు, ప్రజానాయకత్వము గల్గిన వ్యక్తి, యాస్తిక పాఠశాల పెట్టినవారు, బ్రహ్మసమాజ వ్యాప్తికై తొలిగా పూనుకొన్న వ్యక్తి ఏలూరి ఈయన పాఠశాలను కందుకూరి ఉపన్యాసాలకు వాడుకున్నారు

టంగుటూరి శ్రీరాములుగారు గొప్ప ప్రజానేతలు. ప్రఖ్యాతి గల న్యాయవాది పత్రికా సంపాదకుడు. మొదట్లో ఈయనకు వస్త్రాలు యిచ్చినవారు. కందుకూరి, ది శ్యామారావు హిందూ సమాజాభివర్ధని సంపాదకులపై వేసిన వ్యాజ్యమున కందుకూరి తరఫున ప్లీడరుగా పని చేసిన వ్యక్తి. ఆయన కందుకూరి దుస్థితిని చూచి ఖేదపడి వ్యతిరేకించారు.

బ్రాహ్మణత్వంపై విద్వేషం, అవమానం కల్గజేయు ప్రవృత్తి —

విరూపాక్ష పీఠాధిపతులైన శంకరాచార్యులు గారిని అవహేళన ఎంతగానో చేశారు. చేయవచ్చు కానీ నీచాతినీచంగా సభ్యతను, సంస్కృతిని విడనాడి ఎలా వ్రాశారో చూడండి. పుట 118. ఈ స్వాములవారు మగనిని విడిచి లేచిపోయి బహిరంగంగా జగన్నాథపురములో వ్యభిచరించుచుండిన ఒక బ్రాహ్మణ ముండవలన ధనస్వీకారమును చేసి, యామె యిల్లాలివలన భిక్షగైకొని, భాగ్యము విడిచి పెట్టినందునకై దాని మగనికి బహిష్కారపత్రికను బంపి యాతనికి శుద్ధపత్రిక నిచ్చుటకయి యధిక ధనమును లాగ జూచిరి.

రాజమహేంద్రవరము నందు మండల న్యాయసభలో క్రిమినలు రికార్డుకీపరుగా నుండి యుద్యోగమును పోగొట్టుకొని 50 ఏళ్ళు దాటియున్న బొల్లాప్రగడ వెంకన్నగారను వృద్ధగృహస్థు చిరకాలము క్రిందటనే ముట్లుడిగిన 50 ఏండ్ల వృద్ధాంగనతో వ్యభిచరించినట్లు నేరము మోపి యాయనకు బహిష్కారపత్రికను బంపి విశేషవిత్తము నాకర్షించుటకయి ప్రయత్నించిరి (స్వీయచరిత్ర ప్రథమ భాగం 118 పుట.)

చిరకాలము క్రిందటనే కులము విడిచి లేచిపోయి తురకపేటలో కాపురముండి బిడ్డలను గన్న యొక బ్రాహ్మణ కులట యొక్క పుత్రుని తమ పీఠముకడ శిష్యునిగా స్వీకరించిరి.

ఇవన్నియు వివేకవర్ధని వెల్లడించు చుండెనని వ్రాసికొన్నారు (118 పుట)

128 పుటలో ఎంత నీచస్థితికి పంతులు గారు దిగారో పరికించండి

జ్యోతిశ్శాస్త్ర విదుడైన వైదిక, మార్గోపజీవి యగు శిష్టబ్రాహ్మణగృహస్థు డుండెనట. ఆయన దగ్గర 16 ఏండ్ల పినతండ్రి కూతు రుండెనట. ఆవిడ బాల వితంతువట. ఆ పిల్ల చీరలు కట్టుచూ, నగలు ధరించి, రవికలు తొడుగుచూ అలంకరించుకొను చుండెడిదట. ఆ పిల్లకు

పెండ్లి చేసికొనవలెనని ఇచ్ఛ. అన్నగారికది ఇష్టములేదట. అందువలన ఆవిడకు కేశఖండన జరిపించి, అంచులేని ముతుక బట్టలు కట్టింప దలచి, బట్టదెచ్చి, యీయగా, నాకెందుకని వదిన తీయ్యమన్న దట. ఆ అన్నగారు కోపిస్తే నేను వివాహము చేసికొందునని పట్టు పట్టినదట అందువలన ఆయన బంధువర్గము యోచించి పెండ్లి తప్పు - నీవెవరినైనా వుంచుకొని వ్యభిచరించు, మేము అడ్డురాము. పెండ్లి మాత్రము చేసికోకు అని, ఆ రీతిగ అనుసరించగ ఆ బ్రాహ్మణ బాలికకు అనుమతి నిచ్చినట్లు వ్రాసి-మనవారు పూర్వాచార పరాయణులగుటచేత నీతిబాహ్యమైన గూఢవ్యభిచారమునైన నంగీకరింతురు గాని యాచార విరుద్ధమైన ధర్మవివాహము నంగీకరింపరు. అని ఏవేవో వ్రాశారు. ఆ జ్యోతిష్కుని పేరు మాత్రము తెలుపలేదు. ఇలాంటి వృత్తాంతములు - చిలకమర్తి, వల్లూరి సూర్యనారాయణ, దాసు విష్ణురావు, రాయసం చరిత్రలలో కానరావు. వారూ సంస్కరణ పూరితులే. వీరి అనుయాయులే. ఇంత నైచ్యానికి దిగలేదు. ఈయన నైచ్యాన్ని సంస్కార యుతంగా వీరందరూ ఖండించారు. ఏమిగించుకున్నారు ఇలా బ్రాహ్మణులను కించపరుస్తూనే తాను 'బ్రాహ్మణుండను. హూణ భాష నేర్చి యందు నే ప్రవేశ పరీక్ష నిచ్చినాడ' నని డప్పు వాయించుచున్నారు. కంచే చేను మేసినట్లు ఆయనే రంకుతనం ప్రవాహంలో యిరుక్కున్నారు. రంకు నేర్చినవారు బొంకు నేర్వరా! వారి స్వీయచరిత్ర తీరది . . . .

* * *

# శిథిల శిల్ప వ్యథలు

— శ్రీ కొలచన వెంకటరమణమూర్తి ఎం ఏ., బి.ఇడి.

*కరకు కత్తి లిచట పరవళ్లు త్రొక్కగ
మూకఖండిత శిల్ప మూర్తిసాక్షి
పాషాణ హృదయులే స్వైరించి రసుటకు
శిథిలశిల్ప హృదయ వ్యథలుసాక్షి
క్షుద్రమ తోన్మత్త రౌద్ర నాట్యమునకు
భ్రష్టు పట్టినది దేవళము సాక్షి
సృష్టికి మునిషిపై దిష్టి సోకె నవగ
కమిలికమిలెను కంబములు సాక్షి
తెగిన పగిలిన తొలగిన తెగుబడిన
విరిగి తరగి కరగి నల్గి యొరిగి చితికి
భ్రంగివంగిన రమణీయ భంగిమలను
చూచి నేనొక శిలవోలె గ్రుక్కపోతి.
*తలల తాకిళ్ళ దక్కలిగింతలై మేను
పులకరింప శిలలు పూలు పూసె
శిల్పుల మహనీయ కల్పనా పటిమను
పరవశించియొ రాళ్ళు ప్రతిమలాయె
నిష్ఠుర నిర్నిద్ర నిరుపమ దీక్షను
వాసిత పాషాణముల్ హర్మ్యమాయె
నే విధ్వశిల్పి తా నేమి మంత్రించెనో
రాతిని మీటిన గీతులాయె
కాలపురుషుని కఠిన హుంకార నినద
కలిత ధారల కణురోడ్డి సలిచి శిలలు
బండబారిన బ్రతుకుల పెండ్లిబడితోయు
కథలగాథల వినిపించు గడప నేడు.
*పాషాణ హృదయ మనియెడు
దూషణమును విన్న రాతిలో ప్రేలపడుచున్
రోషంబున విచ్చెను గా
ఈషణ్మాత్రావమాన హీనత తొలగన్.
*కరములు తెగికొన్ని కనులుతొలగికొన్ని
ముక్కలేక కొన్ని ముండెకొన్ని
తలలు విరిగికొన్ని చెలువు కరగికొన్ని
కదనభూమి కరణి చెదరె కళలు.
*ఏరాజు లీరుద్ర హేరంబ దేవుల
గొలిచి కాలాంబుధి కలిసినారో
యేరాణు లిచ్చోట హేమాంబర నిధుల
నర్పించి యమరత్వ మందినారో
యేనర్తకీమణుల్ గాన నాట్యకళల
నింపి దశదిశల నెగడినారో
యే భూసురోత్తము లిచ్చోట వేదాళి
ఘనజటల్ పల్లించి ఘనత గనిరో
యొక్కపోరి నా యొడదను త్యాతలూతి
కాలకాలాంతరంబుల కడకు నిలిచి
పూర్వ తప్పక్కొ వైభవ స్ఫూర్తి గాంచ
కనుల దెరపించె నల్లడ హనుమకొండ.
"రామప్పా! యీ శిల్పం
బే మద్భుతం మించోద్య మేమో యౌనో
రా మప్పా! నిని వదలి
పోవంచును బలవంతముందు పోదినిరవీతల్"
*రామప్ప గుడియు చెఱువున్
భూమిజుల దయామృతంబు పొందెనొ లేకో
రామప్ప గుడిని చూచిన
నామది చెఱువయ్యె శోకనాదం బెసగన్.
*జైన హైందవమత సామరస్యంబునం
బద్ధాక్షి యొంటగిరి బరిఫవిల్లె
ప్రాచీన శిల్ప విభవ దర్పణంబున
దశశత స్తంభాళి తనరుచుండె
రమణీయ నృత్యముల్ రంజిల్లు శిల్పముల్
గణరామ ప(ప్ప) గుడియు గులుకు
చుండె
సిద్ధు లర్చించెడు సిద్ధేశ్వరాలయం
బొకచోట ఘనుతతో నొప్పుచుండె
ఆంధ్రరాజ్ఞి తేజ మనుపమ మనుభవించి
భద్రకాళి యొకట వాసమొందె
గిరిని నిలచె నచట నరసింహ దేవుండు
ధీ కజముల తెల్పుడు భద్రమనుచు.

(1985 సం॥ రములో ఓరుగల్లు, హనుమకొండ ప్రదేశముల కేగి యచట గల దేవాలయములను రామప్ప చెఱువును జూచితిని. అలనాటి భావపరంపరయే పద్య రూపమున నిట్లు విధముగా భావిల్లినది.)

* * *

రాజమహేంద్ర వరప్రభుడైన వీరభద్రారెడ్డి ఒకరోజున కొలువు తీరివున్న సమయంలో అతడి అన్న అల్లాడ వేమారెడ్డి శ్రీనాథుడితో,

ఈ క్షోణిన్ నినుఁ బోలు సత్కవులు లే
 రీనాటి కాలంబునన్
దక్షారామ చళుక్యభీమవర గం
 ధర్వాప్సరో భామినీ
వక్షోజ ద్వయ గంధసార ఘుసృణ
 ద్వైరాజ్య భారంబు న
ధ్యక్షించున్ కవిసార్వభౌమ! భవదీ
 య ప్రౌఢ సాహిత్యముల్
 (కాశీ పీఠిక. 14)

అని సంస్తుతించి,'నీవు నిర్మించబోతున్న కాశీఖండాన్ని మా తమ్ముడి కంకిత మీయ వలసిం' అని కోరాడు. శ్రీనాథుడదే విధంగా ఆ గ్రంథాన్ని అతడి కంకితంగా రచించాడు.

ఈ స్తుతి పరంపర మొత్తంలోనూ 'ఈ క్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీనాటి కాలంబునన్' అనేది బ్రహ్మాస్త్రంలాంటిది. ఇందులో ఎంతైనా సత్యమున్నది. శ్రీనాథుడు దక్షిణాధిపుడి ముత్యాలశాలలో కనకాభిషేక గౌరవాన్ని పొందాడు, అమృతపిండం లాంటి కాశీ ఖండాన్ని, దివ్యౌషధంలాంటి నైషధాన్ని రసోత్తరంగానూ, అనితరసాధ్యంగానూ ఆంధ్రీకరించాడు. ఉత్కటవివాద ప్రౌఢితో గౌడడిండిమ భట్టు కంచుఢక్కను పగుల గొట్టించాడు.

ఇంతటి కావ్య శూరుడు కనుకనే తనను గురించి తాను అంత బింకంగా చెప్పుకొన్నాడు.

జనశ్రుతులలోనూ, చిట్టకథలలోనూ వికటకవిగా, హాస్యగాడుగా ప్రచారంలో వున్నప్పటికీ, పాండురంగ మాహాత్మ్యం ఘటికాచల మాహాత్మ్యం వంటి ప్రౌఢ ప్రబంధాలను రచించి, 'పాండురంగవిభుని పదగుంఫనంబుసు' అని ప్రఖ్యాతిని పొందిన కవి వృషభుడు తెనాలి రామకృష్ణుడు. ఒకనాడు విరూరి వేదాద్రిమంత్రి రామకృష్ణుడిని తన సన్నిధికి రావించుకొని, అర్ధాసనాసీనుడిని చేసి,

ఉదయం బస్తగమంబు సేతువు హిమ
 వ్యూహంబులుం జుట్టిరా
విదితం బైన మహీన్ మహాంధ్ర కవితా
 విద్యా బల ప్రౌఢి నీ
కెవ్వరేరి సరసార్థ బోధ ఘటనా
 హేలా పరిష్కార! శా
రద నీ రూపము రామకృష్ణ కవి చం
 ద్రా! సాంద్ర కీర్తీశ్వరా!
 (పాండు. 1-27)

అని ప్రస్తుతించి, 'పాండురంగడి చరిత్రను నా కంకితంగా వ్రాయవలసింది' అని కోరాడు. రామకృష్ణుడంగీకరించి, ఆంధ్ర కావ్యాలలో ఒకటిగా ఎన్నదగిన విధంగా ఆ కావ్యాన్ని రచించి, అతడికి కృతి యిచ్చాడు.

ఈ రామకృష్ణుడే పెద్దన వరసలో తనకు సంఘటిల్లిన ఒకే వాగ్యుద్ధంలో తన కవితా మహాత్త్వాన్ని ఒక చాటు పద్యంలో తెలియజేశాడు.

ఒకని కవిత్వమం దెనయు
 నొప్పులు దప్పులు నా కవిత్వమం
దొకనికిఁ దప్పుఁ బట్టు పని
 యుండదు, కాదని తప్పు బట్టినన్
మొకమటు క్రిందుగా దిగిచి
 ముక్కలు వోవ నినుప కత్తితో
సికఁ గొరగింతుఁ గోసు, మది
 చెప్పిన గొట్టుదుఁ, గాలిఁ దన్నుదున్.

తంజాపురాధీశ్వరుడైన రఘునాథనాయకుడి ఆస్థానాన్ని అలంకరించి, విజయవిలాసాది ప్రబంధాలను రచించిన కవి చేమకూర వేంకటకవి. 'ఇంటి పేరు పసగా వున్నప్పటికీ కవిత్వంలో పసవున్న' దని, విమర్శకుల చేత మన్ననలను పొందిన కవి ఇతడు.

అభినవభోజరాజ బిరుదాంచితుడైన రఘునాథ నాయకుడు వేంకటకవితో

ప్రతి పద్యము నందుఁ జమ
త్కృతి గలుగఁగఁ జెప్ప నేర్తు, వల్లెడ
 కవితా
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గ మెవరికిన్ రాదు సుమీ!
 (విజయ విలాసం. అవ. 50)

అన్నాడు. స్వయంగా కొన్ని కావ్యాలను, యక్షగానాలను రచించిన రాజకవి రఘునాథుడు చేసిన ఈ ప్రశంస ప్రత్యక్షర సత్యం. విజయవిలాసం తీసుకొని, అప్రయత్నంగా ఏ పుటను తెరచినప్పటికీ, ఆ పుటలోని పద్యాలలో ఏ ఒక్కదానిలో నైనప్పటికీ ఏదో ఒక సౌందర్యం అది అర్థాలంకారం కావచ్చు, శబ్దాలంకారం కావచ్చు, లేదా సూక్తి, సామెత, నానుడి, పలుకుబడి, లేదా మరొకటి ఉండితీరుతుంది. అందుకే రఘునాథుడు వేంకటకవి నా విధంగా సంబోధించాడు.

ప్రాచీన కవిత్వానికి భరత వాక్యాన్ని ఆధునిక కవిత్వానికి నాందీ పలికిన అద్వైత సాంధ్రీ కవి ప్రపంచ నిర్మాతలు తిరుపతి వేంకట కవులు. అటు గద్వాలనుండి, ఇటు చెన్నపట్టణం వరకు మధ్యలోవున్న ఆస్థానాలన్నింటిని సందర్శించి అసంఖ్యాకంగా అష్టావధానాలు, శతావధానాలు చేసి, తమ వాణితో తెలుగుదేశాన్ని మంత్రముగ్ధం చేసిన కవీంద్రఘటా పంచాననులు తిరుపతి వేంకటకవులు.

వారు ఒక పర్యాయం గద్వాలకు వెళ్లినపుడు శ్రీరామ భూపాలుడితో తమ అవధానాది విద్యలను గురించి, ఈ విధంగా చెప్పారు

శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్నఁ
 గరతలామలకమ్ము గాద మాకు!
నష్టావధాన కష్టాతలంబన మన్న
 నంబికొండయు దంచనంబు మాకు
నాశుధారా కవిత్వాడంబరం బన్న
 నల్లేరుపై బండినడక మాకు,
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
 వద్రబో ఇంత భోజనము మాకు,

# రామాయణ కల్పవృక్ష సౌరభాలు

ఇటీవల 'విజయనగరం' గురజాడ స్మారక జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సాహితీ మిత్ర సమాఖ్య విజయభావన ఏర్పాటుచేసిన ప్రసంగ కార్యక్రమంలో చోడవరానికి చెందిన శ్రీ ముత్యాల రామమూర్తి ప్రధాన వక్తగా పాల్గొని 'విశ్వనాథవారి రామాయణ కల్పవృక్ష సౌరభాలు' అనే విషయంపై ప్రసంగించారు

శ్రీకృష్ణుడు ధర్మబోధకు ప్రతినిధి కాగా, శ్రీరాముడు ధర్మాచరణకు ప్రతినిధి అని శ్రీ రామమూర్తి చెప్పారు. శ్రీరాముడు జ్ఞానపథవిహారి అని చెబుతూ పితృవాక్య పాలనము, ఏకపత్నీవ్రతము, భాతృవాత్సల్యము, దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఇత్యాది గుణములచే ఆయన మానవు లందరికీ ఆదర్శదైవమైనా డని వివరించారు.

శ్రీశ్రీ లాంటివారు విశ్వనాథ వారిని 'పాషాణపాకి' అని విమర్శించినప్పటికీ సరళ సుందరమైన శైలీ విన్యాసంలో మృదుమధురంగా పద్యాలు రచించటంలో కూడా విశ్వనాథవారు సిద్ధహస్తు లని శ్రీ రామమూర్తి రామాయణ కల్పవృక్షం నుండి ఎన్నో పద్యాలనుదాహరించారు. తమోగుణ ప్రధానయైన తాటకిని సంహరించటం, రజోగుణ ప్రధానయైన అహల్యను అనుగ్రహించటం, సాత్విక గుణ ప్రధానయైన సీతను గ్రహించటం ద్వారా శ్రీరాముడు మానవ లోకానికి అందించిన మహోన్నత సందేశాలను విశ్వనాథ వారు తమ రామాయణ కల్పవృక్షంలో విపులీకరించార ని శ్రీ రామమూర్తి చెప్పారు.

ఆయన ఇంకా వసిష్ఠ, విశ్వామిత్ర, వాలి, తార, మారీచ, రావణ పాత్రల చిత్రణలో విశ్వనాథవారు ప్రదర్శించిన ప్రతిభను సోదాహరణంగా వివరించారు. రామసుగ్రీవ మైత్రి ఆదర్శవంతమైన దని, ఆంజనేయుని సేవా నిరతి, కార్యదీక్షాదక్షతకు ప్రతీక యని శ్రీ రామమూర్తి పేర్కొన్నారు. మేనకా విశ్వామిత్రుల ప్రేమకలాపాల సందర్భంగా విశ్వనాథవారు సరసమైన శృంగారాన్ని సున్నితమైన హాస్యాన్ని పోషించా రని చెబుతూ, విశ్వామిత్రి పాత్ర 'ఏకాగ్రత'ను బోధిస్తున్న దని శ్రీ రామమూర్తి తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

సీసపద్య రచనలోను, దుష్కర ప్రాసల కూర్పులోను, సుదీర్ఘ సమాసాల పోహళింపులోను విశ్వనాథవారు కనపరచిన నేర్పును శ్రీ రామమూర్తి సోదాహరణంగా వివరించారు. విశ్వనాథవారు తమ ప్రతిభ మీద ఆత్మవిశ్వాసమున్న వ్యక్తే కాని అహంకారి కాదని, వినయసంపన్నులైన గురుభక్తి కలవా రనీ, గురువుకు కీర్తి తెచ్చిన శిష్యు డనీ శ్రీ రామమూర్తి సాధికారంగా వెల్లడించారు. సంస్కృతి సంప్రదాయాల సంపూర్ణుడైన విశ్వనాథ నిజంగా కవిసమ్రాట్టే అనీ, ఆయనవంటి కవి ఈ శతాబ్దములో మరొకరు లేరని నిశ్చితముగా చెబుతూ శ్రీ రామమూర్తి తమ ప్రసంగాన్ని ముగించారు

విజయభావన సహాయ కార్యదర్శి శ్రీ క. మార్కండేయులు విశ్వనాథవారి వ్యక్తిత్వ కవిత్వ తత్త్వాలను ప్రశంసిస్తూ, పద్యకుసుమాంజలిని ఘటించారు.

(ఆచార్య భావన్)

)—(

## నే ను!


— డా రావదుగు వెంకటేశ్వరశర్మ
ఎం. ఏ., పిహెచ్.డి.


*కాలనదిలోన బ్రతుకు కనుకనక పాత్ర
ముంచుచు, సుఖామృతంబు సేవించుచుండి
లోపరంధ్రాలు గమనింప నోపనయితి
నవ్వరా! భువిసంత వెఱ్ఱిమానవుడ నేను.

*వింత బొమ్మల పుడమి పేల్ బంతి తోడ
ఇంతలో ఆసి, యేమొచ్చు అంకలోని
రంగుల హారంగు కాలంపు చెంగుపట్టి
పఱుచు లేచి సాగడి పసివాడ నేను.

*"నగరుగా వాస్తవాను భవంపు దెబ్బ
తగులు చున్నను మదికి, చిత్రమ్ముగాగ
ఊహ లుయ్యాలలూపగా ఒదగ లేక
వలిగి పోయిండి వెఱ్ఱి మానవుడ నేను"

*"ప్రకృతికిని, గ్రహస్థితులకు కానిసనయి
వెలసి యుంటచే, నాకయంబులకు నాచ
రణములకు నిత్య కురుక్షేత్ర రణములోన
నలిగి పోయెడి వెఱ్ఱి మానవుడ నేను"

♦"మానరాగంబు, మోక్షేచ్ఛ, మంచితనము
మనిషి బలహీనత గెంచు మనసమాజ
సరణి నరయక భ్రమసి, చిచ్చులనిరిచేయ
నలిగి వాయెడి వెఱ్ఱిమానవుడ నేను"

*"ఘణుసంపద ద్రోహ, నిచ్చెనల్ పైకిలాగ
చక్రనేమి క్రమమ్ములో, సంఘమనెడి
పరమ పదరూప సోపాన పటమునందు
తలిలి తిరిగెడి వెఱ్ఱి మానవుడ నేను!"

—··—

గత వార్షిక సంచికలోని కోక్కొండ వేంకటరత్నముగారు అను వ్యాసము రచయితలు శ్రీ దిగవల్లి వేంకటశివరావు గారు. పొరపాటున అచటవారి పేరు పేర్కొనబడలేదు. సం పా.



అనఘా మాధవ నీవు మానవులన క
ర్మాసంబద్ధులై యుండియున్
వినుతిం గర్మ ఫలంబు పొందని విరతుల్
విశ్వాసంబునన్ భూమిపై
యనయంబున్ భజియించు నిందిర విభు
న్స్మరించి సోమేశ్వరం గై
కొన వేమందుము నీ చరిత్రమునకున్
నోపింప పద్మోద్భవా!



సమాలోచన 3,4,5,6,7,8,9,10 వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15,20రు.లు
ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

– సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. కె. కాలేజి,
6-4-24, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్),
రా జ మం డ్రి - 1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispeta, (Tyagaraja Nagar) Rajahmundry-1.